# సాటిలేని సాంఘికచిత్రం




కాంచనమాల వై.వి.రావు



శ్రీజగదీశ్ ఫిల్ముసువారి చిత్రము

**Poland has not perished wholly**
**While we live to own her!**

—*Song of the Polish*

# జీవజ్ఞానం

[పోలెండ్ ఉజ్వలాత్మ]

రచయిత:

నార్ల వెంకటేశ్వరరావు

ప్రకాశకులు:

నవయుగ ప్రచురణాలయం

పెదసనగల్లు (పోస్టు)

కృష్ణా జిల్లా

అంకితం:

మా ముద్దు చెల్లెలు

చిరంజీవి లక్ష్మీబాయికి

# నార్లవారి

# ఇతర గ్రంథాలు

స్వదేశ సంస్థానాలు

నేటి రష్యా

రష్యన్ కథలు

ఆస్ట్రియా ఆక్రమణ

జెక్ రాజ్య విచ్ఛేదం

పాలస్తీనా

కార్యరంగంలోకి దూకాలని ఉత్సహించాడు. కాని, తల్లి వారించింది. "నీవు చక్కగా చదువుకోవాలి: దేశ పరిస్థితుల్ని తెలుసుకోవాలి: మానవ స్వభావాన్ని అవగాహన చేసుకోవాలి. జ్ఞానశూన్యమైన సేవ రాణించదు" అని ఆమె హితబోధ చేసింది.

దీన్ని ఆయన ఆజ్ఞగా శిరసావహించాడు. స్వాతంత్ర్య సమరంలో దూకాలని హృదయం పరితపిస్తున్నా, విద్యాసముపార్జనపై దృష్టిని కేంద్రీకరించాడు. ఎం. డి. (డాక్టర్) డిగ్రీ పరీక్ష కొసవరకు వచ్చాడు. కాని, చదువుగొడవలోనైనా దేశాన్ని పూర్తిగా మరిచిపోలేక పోయాడు. తనవలె దేశంకోసం పరితపించే ఇతర విద్యార్థులతో చేరి, భావినిగురించి సమాలోచనలు చేశాడు. ఇదే జార్ ప్రభుత్వ దృష్టిలో కుట్రదారుగా కన బడింది. పర్యవసానం — సైబీరియాలో అయిదేళ్ల ప్రవాస. శిక్ష. ఈ శిక్షా కాలంలో సోషలిస్టులతో స్నేహం ఏర్పడింది; మార్క్సిస్ట్ సిద్ధాంతా లతో పరిచయం కలిగింది.

1893 లో సైబీరియానుంచి తిరిగి రాగానే "రోబోట్నిక్" (కూలీ) అనే పత్రికను స్థాపించాడు. ఈ పత్రికకు తానే ఎడిటర్, తానే ప్రూఫ్‌రీడర్: తానే కంపోజిటర్, తానే ప్రింటర్; తానే ఆఫీస్ మేనేజర్, తానే ఆఫీస్ బాయ్. మొదట కొంతకాలం ఈ పత్రిక జార్ ప్రభుత్వ దృష్టిని ఆకర్షించలేదు. కాని, పత్రిక ప్రచారం వృద్ధి అయ్యేసరికి, గూఢచారులు వెంటబడ్డారు. చాలా చాకచక్యంతో ఏడేళ్లపాటు ఎలాగో తప్పించుకు తిరిగాడు. చివరికి 1900 లో ఆఖరికి చిక్కాడు. వార్సా జెయిల్‌లో ఖైదీ అయ్యాడు. ఈసారి అనుభవించవలసివచ్చిన కష్టాలు ఇన్నన్ని కావు. హంతకుల్ని బంధించే చీకటి కొట్టులో లాకప్. వేళకు ఇంత తిండి తెచ్చిపడవేసే వార్డర్ని తప్పితే, ఇంకొకర్ని కంటితో చూడ్డానికైనా వీలులేని పరిస్థితి. ఈ నరకకూపంలో నుంచి బయటపడ్డం ఎలా? బయటవున్న పార్టీ మిత్రులు పిచ్చిఎత్తిన

నాడిలా నటించమన్నారు. కొన్ని రోజులపాటు ఈ నటన జరిపిన తర్వాత, అది దుర్భరమై పోయింది. కాని, బయటవున్న మిత్రులు పట్టు వీడలేదు. వారి ప్రయత్నె ఫలితంగా పిచ్చి ఆసుపత్రికి ట్రాన్స్ఫర్ జరిగింది. అక్కడ ఒక పార్టీ మెంబర్ డాక్టరుగా ప్రవేశించి, సమయం కనిపెట్టి విడుదల చేశాడు. విడుదలైన తర్వాత తిరిగి పత్రికా ప్రకటన. తిరిగి జాతీయ ప్రచారం. ఇంతేకాదు. పార్టీకి డబ్బు కూడబెట్టడంకోసం బంది పోట్లు. దేశకార్యనిర్వహణంలో అటు లండన్ నుంచి, ఇటు టోకియోవరకు ప్రయాణాలు.

ఇలా నిరంతరం నిద్రాహారాల్ని కూడా మరిచిపోయి కష్టపడుతూ వుండగా గత ఐరోపా మహాసంగ్రామ ప్రారంభం. (1914 – 1918) పోలెండ్ ను స్వతంత్ర రాజ్యంగా ప్రకటిస్తామని జర్మనీ, ఆస్ట్రియాలు చేసిన వాగ్దానాల్ని నమ్మి, రష్యాపై దాడి సాగించడం. 1917 లో రష్యా పరాజయం చెందగానే, జర్మనీకి దాని వాగ్దానంమాట జ్ఞాపకం చేసినందుకు తిరిగి జైలు. 1918 లో జర్మనీ వోడిపోగానే విముక్తి. వెంటనే పోలిష్ స్వతంత్ర రాజ్యప్రకటన: దానికి ప్రథమ అధ్యక్షుడైన గౌరవం. ఇదీ పిల్సుడ్ స్కీ జీవితచరిత్ర సంగ్రహం! ఇది మాతృదేశ స్వాతంత్ర్య సిద్ధికి కఠోరతపస్సు అనడం అతిశయోక్తి కాదు.

కాని, మార్షల్ పిల్సుడ్ స్కీ జాతీయాభిమానమే ఆయనలో ఒక పెద్ద లోపమైంది. సోషలిస్టుగా ఆయన జీవితాన్ని ప్రారంభించాడు. ఎంతవరకు సోషలిస్టుల సహచర్యం తన జాతీయోద్యమానికి వినియోగిం చిందో, అంతవరకు దాన్ని వినియోగించుకున్నాడు. ఆ తర్వాత అసలు సోషలిస్టు సిద్ధాంతాలకే విరోధి అయ్యాడు. ఇది ద్రోహమని ఒక సోషలిస్టు మిత్రుడు నిందిస్తే, “నీవూ నేనూ సోషలిజం అనే రైలును అందు కున్నాము. నేను పోలిష్ స్వాతంత్ర్యం అనే స్టేషన్ దగ్గర దిగిపోయాను; నీవు యూటోపియాకు (ఆదర్శరాజ్యానికి) నీ ప్రయాణాన్ని సాగించు”

అని అపహాస్యం చేశారు. అయితే, ఒకవిధంగా పిల్సుడ్‌స్కీ వైఖరి సహజమైందే!

1772 లో రష్యా, జర్మనీలు మొట్టమొదటిసారిగా పోలెండ్‌ను పంచుకున్నాయి. అప్పటినుంచి 1815 వరకు మరి మూడుసార్లు పోలెండ్ పంపకం జరిగింది. నాల్గవ పంపకంలో రష్యా, జర్మనీ, ఆస్ట్రియాలు భాగస్వాములు. 1915 వరకు ఈ నాల్గవ పంపకం అమలులోనే వుంది.

ఏదో ఒక విదేశీ రాజ్య దాస్యానికి లోబడి వుండటమే దుర్భరం. ఇక, మూడు విదేశీ రాజ్యాలకు గులాంకావటం సంగతి చెప్పనక్కర్లేదు. అందుచేతనే పోలిష్‌వారిలో జాతీయత మూర్తీభవించి, చివరికి అది ఒక జాడ్యంగా పరిణమించింది. * పిల్సుడ్‌స్కీ ఈ జాడ్యానికి అందరికంటె ఎక్కువగా గురికావటం సహజం.

అయితే, ఇది సహజమైనంత మాత్రాన సమర్థనీయం కాదు. జాతిపరాధీనాన దాస్యం ముగిసినప్పుడు అది జాతీయాహంకార

---

* పోలిష్ ప్రజల ఈ ప్రగాఢ జాతీయతను ఆధారం చేసుకొని ఎవరోగాని ఈ క్రింది కథ కల్పించారు: ఏనుగునుగురించి పుస్తకాన్ని వ్రాయవలసి వచ్చింది. అప్పుడు ఇంగ్లీషువాడు ఇండియాకు వెళ్ళి, ఏనుగుల్ని వేటాడి, "నా ఏనుగుల వేట" అని ఒక పుస్తకాన్ని వ్రాశాడు. ఫ్రెంచి వాడు జంతు ప్రదర్శనశాలకు వెళ్ళి, అక్కడి ఏనుగును చూచివచ్చి "ఏనుగు అందం" అనే పుస్తకాన్ని ప్రకటించాడు. జర్మన్ దేశీయుడు నాలుగేళ్ళపాటు లైబ్రరీలో కూర్చుని "ఏనుగుల పుట్టుపూర్వోత్తరాల సంగ్రహవివరణ" అని అయిదు సంపుటాల గ్రంథాన్ని తయారు చేశాడు. రష్యన్‌వాడు "ఏనుగు - మాయ" అని వేదాంతం చెప్పాడు. పోలిష్ వాడు "ఏనుగు: పోలిష్ జాతీయ సమస్య" అని ఒక ఉద్రేకపూరితమైన కరపత్రాన్ని రచించాడు!

పోతుంది. పిల్సుడ్‌స్కీ విషయంలో ఇదే జరిగింది. పోలిష్ జాతికి చెందిన వారినందరినీ, పోలిష్ భాషను మాటాడే వారినందరినీ ఒక రాజ్యం కిందికి తేవడంతో సంతృప్తిపడక, ఆయన పోలెండ్‌ను ఒక మహా రాజ్యంగా చెయ్యాలనుకున్నాడు. ఇందుకోసం జర్మన్ జాతివారు నివాసమున్న కొన్ని ప్రాంతాల్ని ముందుగానే పోలెండ్‌లో కలుపుకున్నాడు. ఆతర్వాత రష్యాలోని అంతర్యుద్ధాన్ని అవకాశంగా తీసుకుని, దానిపై దండెత్తివెళ్ళి, 1920 లో దానిదగ్గరినుంచి వెస్టరన్ యూక్రెయిన్ రాష్ట్రాన్ని అపహరించాడు. ఆతర్వాత లిథులేనియాపై కత్తికట్టి, 1927 లో దానిదగ్గరినుంచి విల్నా జిల్లాను వశపరుచుకున్నాడు.

ఈ దురాక్రమణలే పోలెండ్‌కు అనేక కొత్త సమస్యల్ని కల్పించి, దాని జాతీయైక్యతకు విఘాతాల్ని కూర్చింది.

ఇంతేకాదు. విదేశ ప్రభుత్వాలతో సంఘర్షణల్ని సాగించడంలోనే జీవితాన్ని వెళ్ళబుచ్చినవాడు కావడంవల్ల పిల్సుడ్‌స్కీలో సైనిక ప్రవృత్తి ప్రబలింది. అందుచేత ఆయన పోలెండ్‌ను ఒక పెద్ద సైనిక శిబిరంగా చెయ్యాలనే ధోరణిలో పడిపోయాడు. ప్రభుత్వవర్గంలో ముఖ్య స్థానాల నన్నిటిని సేనాధిపతులకు కట్టబెట్టాడు. సైనిక వ్యయంకోసం ప్రజలపై అధికమైన పన్నుల్ని వేశాడు. సైన్యాభివృద్ధికోసం చూపిన శ్రద్ధలో లేశమంతైనా ఆర్థిక, పారిశ్రామిక అభివృద్ధిపట్ల చూపలేదు. అందుచేత పోలిష్‌రాజ్యం సముద్రపువొడ్డున ఇసుకలో కట్టిన పిచ్చిక గూడులా అయిపోయింది.

నేటి పోలెండ్ దుస్థితికి ఈవిధంగా కొంతవరకు పిల్సుడ్‌స్కీయే కారణం. ఈ సంగతి తెలిసివున్న — గ్రహించగల — నేను తాతలా పిల్సుడ్‌స్కీ స్తోత్రం చెయ్యలేను.

కాని, ఒక్క విషయంలో మాత్రం నేను తాతతో పూర్తిగా ఏకీభవిస్తాను: "ఈ ప్రళయం తర్వాత పోలెండ్ పునర్జన్మ నెత్తుతుంది."

# పాత్రలు

మనమడు

తల్లి

తాత

ఈ ఏకాంక రూపకాన్ని ఆల్ ఇండియా రేడియో (మద్రాసు శాఖ) వారి సూచన ననుసరించి వ్రాశాను. దీన్ని వారు యుద్ధవిరామ దినంనాడు – 11. నవంబర్, 1939 – బ్రాడ్ కాస్ట్ చేశారు. వారు బ్రాడ్ కాస్ట్ చేసిన పాతంలో దీనిలోని కొన్ని వాక్యాలు లేవు. ప్రస్తుత రూపంలో ఈ ఏకాంక రూపకం మంచి చెడ్డల బాధ్యత పూర్తిగా నాదే.

సీన్ : వార్సాలో ఒక డ్రాయింగ్ రూం. కుడివైపునుంచి బయటికి ద్వారం. ఎడమవైపున రెండు కిటికీలు. వాటిమధ్య ఫైర్ ప్లేస్. వెనక భాగాన మేడ మెట్లు. గదిమధ్యనుంచి కొంత ఎత్తు లేచిన తర్వాత రెండు వరసలుగా చీలి, ఒక వరస కుడివైపుకూ, ఇంకొకటి ఎడమవైపుకూ పైకి వెడుతున్నాయి. మెట్ల వరసలలో ఎడమ దానికింద బీరువా, కుడిదానికింద సైడ్ టేబుల్; ఆ టేబుల్ పైన రేడియో; దాని ఎదట ఒక కుర్చీ. సైడ్ టేబుల్ వున్న గదిమూల ఒక కప్‌బోర్డ్. గది మధ్యలో ఒక సెటీ; నాలుగు కుర్చీలు. వాటి మధ్య గ్లాస్‌టాప్ టేబుల్. దానిమీద చప్పగా వాడిపోయిన పుష్పాలతో ఫ్లవర్ వాస్. సెటీకి ఒక చివర చిన్న టేబుల్. దానిమీద బుక్ షెల్ఫ్, న్యూస్ పేపర్స్ వున్నాయి. గదిలో ఒక పక్కగా పామ్‌స్టాండ్. దానిమీద మార్షల్ పిల్సుడ్‌స్కీ బస్ట్. గది మధ్య చక్కని తివాచీ

[ఈ వివరణలో కుడి ఎడమలు ప్రేక్షకుల వైపునుంచి; నటీ నటకుల వైపునుంచి కాదు.]

సమయం : 1939 సెప్టెంబర్ 10 వ తేదీ ఉదయం.

సెటీలో ఒక మూలకు ఒదిగి తాత కూర్చుని వుంటాడు. ఆయన ముఖం చింతాక్రాంతంగా వుంటుంది. టీ ట్రే పుచ్చుకుని మనమడు ప్రవేశిస్తాడు.

మనమడు : తాతా! తాతా!... పిలిచేది నిన్నే, తాతయ్యా!

తాత : (ఆలోచనలు అన్నీ ఎక్కడో వున్నట్టు) ఆఁ!

మనమడు: నీ టీ ఇదుగో!

తాత: ఊఁ!

మనమడు: అమ్మ పనితొందరలో వున్నది. టీ కోసం కిందికి రాలేనని చెప్పమన్నది.

తాత: ఊఁ!

మనమడు: బ్రెడ్ లేదు. కప్‌బోర్డులో బిస్కట్లు మిగిలివుంటే తీసుకోమన్నది, తాతయ్యా!

తాత: సరిలే, బాబూ!

మనమడు: మరి, నేను పోనా?

తాత: మంచిది, బాబూ!

[మనమడు మేడ మీదికి వెళ్ళడానికి నాలుగు మెట్లు యెక్కేసరికి —

తాత: బాబూ!

మనమడు: ఆఁ!

తాత: ఇలా ఒకసారి రా!

మనమడు: (మెట్లుదిగుతూ) దేనికి?

తాత: మన గరాజ్‌లోకి వెళ్ళి, ఆయిల్ కాన్ పట్టుకురా!

మనమడు : ఆయిల్ కాన్ దేనికిప్పుడు ?

తాత : చెబుతానుగా ! పరిగెత్తుకు వెళ్లి పట్టుకురా !

[మనమడు గబ గబ, బయటికి వెడతాడు. తలుపు చరాలున తీసి, చరాలున వేసిన చప్పుడు.]

తాత : (మెట్లదగ్గరికి వెళ్లి కుమార్తెను ఉద్దేశించి) అమ్మా !

అమ్మ : (మేడపై నుంచి) దేనికి నాన్నా ?

తాత : బీరువా తాళంచెవి ఎక్కడున్నదమ్మా ?

అమ్మ : సైడ్ టేబుల్ డ్రాయర్‌లో వుంది.

[తాత తాళంచెవి తీసుకుని బీరువా తెరుస్తూ వుండగా మనమడు తిరిగి వస్తాడు.]

మనమడు : ఇదుగో, తాతయ్యా ! ఆయిల్ కాన్. (ముట్టకుండావున్న టీ వంక చూచి) టీ తాగనేలేదేమి, తాతయ్యా? చల్లారి పోతున్నది

తాత : తాగుతాను, బాబూ ! మరి, మీ అమ్మ నడిగి డస్టర్ వుంటే పట్టుకురా !

మనమడు : దేనికి ?

తాత : పట్టుకురా చెబుతాను.

మనమడు : ఊహుఁ ! ముందు చెబితేనేగాని తేను.

తాత : (బీరువాలోనుంచి ఆర్మీరైఫుల్ బయటికి తీస్తూ) ఈ రైఫుల్ వాడుకలేక తుప్పు పట్టిపోయింది; తుడవాలి.

మనమడు : అందుకా! తెస్తాను.

[మేడమీదికి వెడతాడు. తాత రైఫుల్ పుచ్చుకువచ్చి, కుర్చీలో చతికిల బడి, దాని ట్రిగ్గర్ మువ్వార్లు పైకిలాగి నొక్కుతాడు. టక్కు టక్కుమని శబ్దం. ఇంతలో మనమడు తిరిగి వస్తాడు.

మనమడు: నిన్ను అమ్మ చప్పున ప్రయాణం కమ్మంటున్నది, తాతయ్యా!

తాత : ప్రయాణమా? ఎక్కడికి?

మనమడు : ఎక్కడికేమిటి? మన నగరాన్ని ముట్టడి చెయ్యబోతున్నారు. సైనికులు కానివాళ్లందరు వెళ్ళిపొండని రేడియోలో చెప్పలేదా?

తాత : ఆఁ! చెప్పారుకదూ! నే నామాటే మరిచిపోయాను. మరి, చప్పున ప్రయాణమై వెళ్లండి.

మనమడు : అదేమిటి? నీవు రావా?

తాత : రేడియోలో చెప్పిందేమిటి? సైనికులు కానివాళ్ళు వెళ్ళిపొండని. అంతేనా?

మనమడు : అవును.

తాత : మరి నేను సైనికుణ్ణి. ఎలా వస్తాను నీవే చెప్పు ?

మనమడు : ముసలివాడవు నీవేమి సైనికుడవు, తాతయ్యా?

తాత : సైనికుడు కావడానికి ముసలివాడేమిటి? పడుచువాడేమిటి ? ఒకసారి సైనికుడైనవాడు బ్రతికినంతకాలమూ సైనికుడే ?

మనమడు : నీ చేతులు ...

తాత : ఔను ? నా చేతులకు వణుకు పుట్టింది. కాని, గుండెమాత్రం గట్టిగానే వుంది.

మనమడు : నీ చూపు...

తాత : నిజమే! నాచూపు తగ్గింది. కాని, నా దారిమాత్రం సూటిగా కనబడుతున్నది.

[ఈ మాటల్ని అంటూ రైఫుల్‌కు ఆయిల్ రాస్తూ వుంటాడు]

మనమడు : అంతా విపరీతం గాని, ఈ వయస్సులో నీవేమి యుద్ధం చేస్తావు, తాతయ్యా ?

తాత : ఏమంత వయస్సు? ఇంకా డెబ్భై నిండలేదు.

మనమడు : (నవ్వుతూ) అదేమిటి, తాతయ్యా ! నీవింకా చిన్నవాడివనే !

తాత: కాదనుకో! కాని, ఆ మహామహుడు జీవించి వుంటే..."

మనమడు: ఎవరది, తాతయ్యా?

తాత: మార్షల్ పిల్సుడ్స్కీ; మన భాగ్యవిధాత.

మనవుడు: ఆయన జీవించివుంటే ఈపాటికి పట్టేవాడంటావా?

తాత: తప్పక.

మనమడు: నీకంటె ఆయన మూడు సంవత్సరాలు పెద్దవాడని చెప్పావు కాదు, తాతయ్యా?

తాత: ఔను. ఇప్పటికి డెబ్భై రెండు నిండేవి.

మనమడు: ఏమో! అంత వయస్సులో ఆయనైనా ఇంత సాహసాన్ని చేసేవాడు కాను.

తాత: ఆయనకు ఇదొక సాహసమా? కేవలం మూడు వందల మందితో జార్ సామ్రాజ్యంపైన దండెత్తాడు! ఆ మూడువందల మందిలోనుంచే మూడు లక్షలమంది వీరు లుద్భవించారు; శతాబ్దంనుంచీ దాస్యబాధతో క్రుంగిపోతున్న మన దేశం స్వతంత్రరాజ్య మైంది.

మనమడు: కాని, అప్పుడాయన వయస్సెంత?

తాత: అప్పుడా? (ఆలోచిస్తున్నట్టు క్షణం ఆగి) ఆయన

జన్మించింది 1867 లో. ఇహ, రష్యాపై దండెత్తింది 1914 లో. అంటే...”

మనుమడు: 1914 లో 1867 పోతే... ఆఁ!... ఉండు, తాతయ్యా!... చెబుతాను... అదొక 33... ఇదొక 14... మొత్తం 47... అంటే, అప్పటికి నడివయసన్నమాట!

తాత: తర్వాతనైనా ఆయన పౌరుషం వచ్చిందా! పిల్సుడ్‌స్కీ సంగతి నీకు తెలియదు కాబోలు? పోలెండే ఆయన; ఆయనే పోలెండ్. దాస్య శృంఖలాలనుంచి ఆయన విముక్తి చేసిన పోలెండుకు...

[“పేపర్!” అంటూ న్యూస్ బాయ్ పత్రిక పడవేసి వెళతాడు. అది పడిన చప్పుడుకు ఇద్దరూ అటు చూస్తారు.]

మనుమడు: పత్రిక వచ్చింది, తాతయ్యా! స్పెషల్ ఎడిషన్ కాబోలు. (వెళ్ళి దాన్ని తెచ్చి, హెడ్డింగుల్ని చదువుతాడు) “వార్సా సరిహద్దులలో జర్మన్ సైన్యాల ప్రవేశం” ...“పలాయిన మౌతున్న ప్రజలపై ఫిరంగులు”...“మన సైన్యాల వీరోచిత ప్రతి...”

తాత: (ఉద్రేకంతో కూడిన ఉచ్చైస్స్వరంతో) పారిపోతున్న ప్రజలపై ఫిరంగులు! ఇది యుద్ధంకాదు, హత్యాకాండ! హంతకులు! రాక్షసులు!! (ఉద్రేకం మరీ హెచ్చి, ఉక్కిరి బిక్కిరి అవుతాడు. పెద్ద దగ్గు వస్తుంది)

మనమడు: అయ్యో? తాతయ్యా! (చప్పున టీకప్పు దగ్గరికి తీసుకువెళ్ళి) కొత్త టీ పుచ్చుకో! దగ్గు తగ్గుతుంది!

తాత: (గుక్క తిప్పుకుంటూ) వద్దు, బాబూ! వద్దు.

మనమడు: వద్దక పోవడమేమిటి, తాతయ్యా! కొంచెం తాగు – మంచిది.

తాత: (కప్పు అందుకుని, రెండు గుక్కలు తాగి) మరి చాలు బాబూ! (కప్పు టేబుల్ పై పెడుతూ) ఇప్పు డాయన జీవించివుంటే...

మనమడు: వుంటే, ఆయనైనా మాత్రం ఏం చేసేవాడు?

తాత: ఏమి చేసేవాడా? 1920 లో ఏం చేశాడో, ఇప్పుడూ అదే చేసేవాడు. అప్పుడు వార్సాకు ఆరుమైళ్ళ దూరంలోకి వచ్చిన బోల్షివిక్ సైన్యాల్ని ఆయన తరిమికొట్టలేదా?

మనమడు: ఆయన శక్తిపై నీకెంత విశ్వాసం తాతయ్యా!

తాత: ఆయనసంగతి తెలిస్తే నీకూ...

మనమడు: నాకు తెలియకేమి? తెలుసు.

తాత: ఏమి తెలుసు, బాబూ?

మనమడు : అంతా తెలుసు. ఆయన విల్నాలో పుట్టాడు. ఆయన తండ్రి ఆస్తిని జార్ ప్రభుత్వం జప్తుచేసింది; ఆయన అన్నకు వురిశిక్ష వేసింది; ఆయన్ని రెండుసార్లు జెయిల్‌లో పెట్టింది. మొదటిసారి సైబీరియాలో అయిదేళ్ళపాటు సీసం గనిలో కూలీగా పనిచేయించింది. రెండోసారి వార్సాలోనే చీకటి కొట్టులో పడవేసి అష్టకష్టాలు పెట్టింది. ఇంకా చెప్పనా ?

తాత : (మనమడి ధోరణికి చిరునవ్వుతూ) ఊఁ ! చెప్పు !

మనమడు : 1914 లో యుద్ధం రాగానే "మీరు మా పక్షానచేరి రష్యాపై యుద్ధంచేస్తే, మీ దేశాన్ని స్వతంత్ర రాజ్యం చేస్తాం" మని జర్మనీ, ఆస్ట్రియాలవారు వాగ్దానం చేశారు. దీన్ని నమ్మి పిల్సుడ్‌స్కీ రష్యాపై దండయాత్ర సాగించాడు. 1917 లో రష్యా వోడిపోగానే, ఇక పోలెండ్‌ను స్వతంత్ర రాజ్యంగా ప్రకటించమని ఆయన కోరాడు. దీనికి జర్మనీవారిచ్చిన జవాబు, – ఆయన్ని ఖైదులో పెట్టడం.

తాత : (నవ్వుతూ) ఇంకా తేదీలు జ్ఞాపకంలేవా ?

మనమడు : (గారాబంగా) కాదు, తాతయ్యా! ఇంకా చెబుతా, విను ! ఆయన జెయిల్‌కు వెడుతూవుంటే, కష్టకాలంలో ఆయన సాన్నిధ్యాన్ని వుండాలని నీవూ వెంట బయల్దేరావు.

నీవు రావడానికి వీల్లేదని నిరోధించగా "నేను పిల్సుడ్‌స్కీ వాలెట్‌ను; ఆయనవెంట వుండితీరాలన్నావు. 1918 లో జర్మనీ ఓడిపోయింది. పిల్సుడ్‌స్కీ విడుదల అయ్యాడు. పోలెండ్ స్వతంత్రరాజ్యమైంది. తర్వాత నీకు పెద్ద హోదా నిస్తానంటే "కాదు, నేను వాలెట్‌గానే వుంటా" నన్నావు. పిల్సుడ్‌స్కీ మొదటి లీజియన్‌లోని మూడు వందలమందికీ ఇంత తక్కువ హోదాతో సంతృప్తి పడింది నీ వొక్కడవే. నీవు...

తాత: (నవ్వుతూ) నీవు చెబుతున్నది పిల్సుడ్‌స్కీ చరిత్ర కాదు; మీ తాత చరిత్ర.

మనమడు: కాదు, తాతయ్యా! పిల్సుడ్‌స్కీ జీవితచరిత్ర అంతా నాకు తెలుసు.

తాత: నీకు తెలిసిన విషయాలు ఆయన జీవితంలోని కొన్ని ముఖ్య బాహ్య ఘట్టాలు మాత్రమే, బాబూ? ఆయన అంతర్జీవితం నీకు తెలియదు. ఆయన జీవితంమీద, ఆయన జీవిత లక్ష్యాలమీద, వెలుగును ప్రసారించగల చిన్ని చిన్ని సంఘటనలు ఎన్నో నా కళ్ళ ఎదుట జరిగాయి. వీటిసంగతి లోకానికి తెలియనే తెలియదు.

మనమడు: ఏవి సంఘటనలవి, తాతయ్యా? ఏదీ ఒకటి చెప్పు!

తాత : సరే - చెబుతాను విను. ఒకనాడు వీధిలో నవ్వుతూ కేరుతూ ఆడుకుంటున్న పిల్లల్ని చూచి ఆయన నిట్టూర్చాడు.

మనమడు : ఆడుకుంటున్న పిల్లల్ని చూచి నిట్టూర్చడం దేనికి ?

తాత : నేనూ అదే ఆశ్చర్యపోయాను. అయితే అప్పటికి ఊరుకుని, ఆ రాత్రికి "ఉదయం నిట్టూర్చారు దేనికి ?" అని అడిగాను.

అమ్మ : (మేడపైనుంచి) బాబూ !

మనమడు : ఆఁ !

అమ్మ : ఒకసారి చప్పున పైకిరా !

మనమడు : దేనికి ?

అమ్మ : ఈ పెట్టె కిందికి దించాలి.

తాత : వెళ్లు, బాబూ ! సాయం పట్టు.

మనమడు : వెడతానుగాని, ఆయన...

తాత : ముందు వెళ్ళు.

మనమడు : వెడతాలే, తాతయ్యా ! ఆయన...

తాత : వెళ్లిరారా, బాబూ ?

మనమడు: సరే! వెడుతున్నా! (నాలుగైదు మెట్లు ఎక్కుతాడు)

అమ్మ: బాబూ! రానక్కరలేదులే! నేనే దించుకున్నాను.

మనమడు: (తిరిగివచ్చి) నీ ప్రశ్నకు మార్షల్ ఏమని జవాబిచ్చాడు, తాతయ్యా!

తాత: చాలా గొప్ప జవాబిచ్చాడు. "మనం దాస్యబాధ అనుభవించాము. అంచేత స్వాతంత్ర్యంకోసం పరితపించాము. ఎలాగో దాన్ని సాధించాము. నవ్వుతూ కేరుతూ ఆడుకుంటున్న ఆ పిల్లలకు దాస్యబాధ తెలియదు. అంచేత వాళ్ళు స్వాతంత్ర్యం విలువను గ్రహించగలుగుతారా? ఈ సందేహం తోచింది," అన్నాడు.

"ఈ సందేహం ఇంకా మిమ్మల్ని బాధిస్తున్నదా?" అని నే నడిగాను. "లేదు; అప్పుడే పోయింది" అంటూ ఆయన చిరునవ్వాడు. తర్వాత చప్పున కుర్చీలోనుంచి లేచి, గదిలో పచారుచేస్తూ "మూడుసార్లు పంపకం జరిగినా పోలెండు నశించలేదు. మరి ముప్ఫయిసార్లు పంపకం జరిగినా ఇది నశించదు. అజేయమైంది నా పోలెండ్! అమరమైంది నా పోలెండ్ !!" అని గంభీరంగా అన్నాడు. ఆ మాటలు నా చెవులలో ఇంకా...

[విమానాల రొద]

మనమడు: అవిగో, తాతయ్యా! విమానాలు! (కిటికీ దగ్గరికి పరిగెత్తుకు వెళ్లి) ఒకటి ... రెండు ... మూడు ... నాలుగు ... అయిదు ... అయిదు విమానాలు, తాతయ్యా! (విమానాలుదాటి వెళ్లిపోతున్నట్టు క్రమంగా రొద తగ్గుతుంది) ఊరుమధ్యకు వెళ్ళుతున్నట్టున్నాయి. ఉదయం గవర్నమెంటు బిల్డింగ్సమీద చాలా బాంబుల్ని వేశారుట. ప్రాగా ఆసుపత్రి కూలిపోయిందట. మార్షల్ పాలెస్ బూడిదైపోయిందట.

తాత: మార్షల్ పాలెస్ బూడిదైపోతే పోవచ్చు. కాని, మార్షల్ సృష్టించిన పోలెండ్ బూడిదకాదు, బాబూ! బూడిదకాదు. (దగ్గుతూ) బూడిదకాదు: ముమ్మాటికీ!

[మళ్లీ విమానాల రొద]

మనమడు: అడిగో, తాతయ్యా! మళ్ళీ వస్తున్నాయి. (కిటికీదగ్గరికి జరిగి) ఈసారి మూడు. (కొంచెం ఆగి) కాదు, తాతయ్యా! ఈసారికూడా మళ్లీ అయిదు!

[దూరానికి వెళ్ళిపోతూవున్నట్టు విమానాల రొద క్రమంగా తగ్గుతుంది.

మనమడు: తాతయ్యా! (దగ్గరికి వచ్చి) మరి, మా నాన్న విమానం ఎక్కడున్నదో?

తాత: (విచారం ధ్వనిస్తున్న కంఠంతో) ఏమో, తెలియదు, బాబూ!

మనమడు: రోజూ ఉత్తరం వ్రాస్తూవుంటానని చెప్పాడు. ఒక్క ఉత్తరమైనా వ్రాశాడుకాదు.

తాత: ఎక్కడ తీరుతుంది, బాబూ?

మనమడు: ఒక ఉత్తరమైనా రాలేదని రోజులు అమ్మ చాలా బెంగగా వుంటున్నది, తాతయ్యా! నీవు ధైర్యం చెప్పలేకపోయావా?

[తాత జవాబు చెప్పడు]

మనమడు: ఏమి, తాతయ్యా! జవాబు చెప్పవు?

తాత: ఏమీ లేదురా, బాబూ! ఏమీలేదు (కొంచెం ఆగి) ఏమిటది వీధిలో గలభా?

[నాజీలు దాడి జరుపుతున్న భాగంనుంచి ప్రజలు పారిపోయి వస్తు వుంటారు.]

మనమడు: (కిటికీ దగ్గరికి చెక చెక వెళ్ళి) జనం గుంపులు గుంపులుగా పరిగెత్తుతున్నారు తాతయ్యా! కొందరికి చేతులలో పెట్టెలున్నాయి. కొందరు ఉత్తిచేతులతోనే వెళ్ళుతున్నారు. కోటైనా లేదు కొందరికి. (కొంచెం ఆగి) అదేమిటి?...స్ట్రెచ్చర్! గాయపడ్డ ముసలివాణ్ణి స్ట్రెచర్ మీద

ఎత్తుకు వెళ్ళుతున్నారు. (మరికొంచెం ఆగి) అబబ్బ! ఘోరం! చెయ్యి మధ్యకు తెగిపోయింది! రక్తం కాల్వలు కడుతున్నది! అయినా, రెండోచేతితో అయిదేళ్ల పిల్లను నడిపించుకు వెడుతున్నాడు! చెల్లాయి కాబోలు! నా ఈడే వున్నట్టున్నది, తాతయ్యా! ఆ అబ్బాయికి. పాపం! చెయ్యి తెగిపోయింది! (కొంచెం పెద్దగొంతుతో) అదిగో! ఇంకొక స్ట్రెచర్. దానివెనక ఇంకొకటి. (హఠాత్తుగా మరింత గొంతెత్తి) వాటినిండా గాయపడ్డవారే! (హోరన్న మోత) ఎంబ్యులెన్సు కార్లు ... ఒకటి ... రెండు ... మూడు ... అబ్బబ్బ! దారుణం! అతి దారుణం, తాతయ్యా! దవడకు దవడ ఎగిరిపోయింది, ఆ అమ్మాయికి! పాపం! ఏడుస్తూ...

తాత: రారా బాబూ! నీ విలా రా! కిటికీ దగ్గరినుంచి కదిలి రా!

మనమడు: (వినిపించుకోకుండా) ఇంకా వస్తున్నారు, తాతయ్యా! ఇంకా వస్తున్నారు జనం! అదిగో! ముసలిది! నడుముకూడా వంగిపోయింది. కాలికి కట్టు. అది నెత్తురుతో తడిసి ముద్దయింది. కాలు తెగిపోయింది కాబోలు పాపం! అలాగే కుంటుకుంటూ, కుంటుకుంటూ...

తాత: (విసుగు, ఆందోళన మిళితమైన కంఠంతో) ఇలారా బాబూ! కిటికీ మూసివెయ్యి!

మనవుడు : వస్తా, తాతయ్యా ! వస్తా !...అబ్బబ్బ ! ఇది మరీ ఘోరం...మూడేళ్ళ పిల్లవాడు...ఒంటెనిండా నెత్తురే! చచ్చిపోయాడు కాబోలు! మెడ వేలాడుతూవుంది. తల్లి బిడ్డను గుండెకు హత్తుకుని –

తాత : ఇవతలికి రమ్మనేది నిన్ను కాదా! (అంటూనే రెక్క పట్టుకు లాగి, కిటికీ వేస్తాడు.)

మనవుడు : కిటికీని మూశావేగాని, నా కళ్ళనూ, చెవుల్నీ మూస్తావా తాతయ్యా! ఆ దారుణ దృశ్యాలు నాకళ్ళకు కట్టినట్టే వున్నాయి ! ఆ దీనవిలాపాలు నా చెవులలో మారు మోగుతూనే వున్నాయి. అదిగో అది తెగిపోయిన చెయ్యి ! అది మెడ వేలాడవేసిన బిడ్డ. అదిగో ! అది ముసలిదాని మూలుగు ! అది పసిపిల్లతల్లి ఏడుపు !

తల్లి : (గబగబ మేడమెట్లు దిగివచ్చి) ఏమిటది, బాబూ ? కేకలు వేస్తున్నా వేమిటి !

తాత : ఏమీ లేదమ్మా ! గాయపడి వెళ్ళుతున్నవారిని చూచి, ఉద్రేకపడుతున్నాడు.

తల్లి : ఔను ! నాన్నా ! అప్పుడే దాడి ప్రారంభమైనట్టుంది. మనం చప్పున బయల్దేరి వెళ్లాలి. నేను పెట్టే బేడా సర్ది వేశాను. (తండ్రివంక పరీక్షగా చూచి) మీ రింకా ప్రయాణం

కాలేదేం నాన్నా ? (కొడుకువంక తిరిగి) ప్రయాణమవ్వామని తాతతో చెప్పనే లేదా ?

మనమడు : చెప్పానమ్మా !

**తాత :** ఔనమ్మా ! చెప్పాడు. కాని, నేను రాను. మీరు బయల్దేరి వెళ్ళండి.

తల్లి : అదేమిమాట నాన్నా ? మీరు రాకపోవడమేమిటి ?

**తాత :** ముసలివాణ్ణి. ఇవ్వాళ కాకపోతే, రేపు నాప్రాణం పోతుంది. ఎక్కడైతేనేమిటి చచ్చిపోవడానికి ! నేను ఇక్కడే ఇల్లు కనిపెట్టుకు వుంటాను. ఒంటరిదానివి – పిల్లవాణ్ణి ఎలా కాపాడతావో ! వాణ్ణి నెయ్యికళ్లతో సంరక్షించు. వెళ్లమ్మా ! వాణ్ణి వెంటబెట్టుకు త్వరగా వెళ్ళు.

మనమడు : లేదు, తాతయ్యా ! నేనూ వెళ్ళడంలేదు.

తల్లి, **తాత :** ఆఁ !

మనమడు : ఔను. నేనూ వెళ్ళడంలేను.

**తాత :** తప్పు, బాబూ ! అలా అనకూడదు, కాటికి కాళ్ళు జాచినవాణ్ణి; నీవు నాతో వంతా ?

మనమడు : వంతుకాదు, తాతయ్యా !

తాత: మరి?

మనుమడు: నా ధర్మం.

తాత: అదేమిటి?

మనుమడు: అదేమిటా? మార్షల్ ఎందుకు నిట్టూర్చాడు? శత్రుసైన్యంవారు స్వాతంత్ర్యం విలువను గ్రహిస్తారో, లేదో అని కదా! అలాంటప్పుడు చేను పాడైపోవడం తగునా? నీవే చెప్పు, తాతయ్యా?

తాత: అదికాదు, బాబూ! నీవింకా చాలా చిన్నవాడివి.

మనుమడు: నేను చాలా చిన్నవాడినైతే, నువ్వు చాలా పెద్దవాడివి. నీవేగదా, సైనికుడు కావడానికి ముసలివాడేమిటి, పడుచువాడేమిటి అని చెప్పింది!

తాత: వుండు, బాబూ! నామాట విను...

తల్లి: నాకిదంతా అయోమయంగా వుంది. పిల్లవాడికి మీారేమి నూరిపోశారు?

మనుమడు: ఏమీా లేదమ్మా! తాత నా కన్ను విప్పాడు.

తల్లి: ఏమిటది, నాన్నా! వీడింత వింతగా మాట్లాడుతున్నాడు. వీడికి ఏమి బోధచేశారు? (కన్నీరు పెడుతూ)

నా ఒక్క కొడుకునూ నాకు కాకుండా చేస్తారా? వీడినైనా చూచుకు నేను బ్రతుకుదామనుకున్నాను.

తాత: (దగ్గరికి వెళ్ళి భుజం నిమురుతూ) బాబూ! నీవు మంకుపట్టు పట్టవద్దు. పెద్దవాణ్ణి. నా మాట...

మనమడు: తాతయ్యా! మా నాన్న బ్రతికున్నంతకాలమూ ఆయనకు సేవ చేస్తున్నావు. ఆయన చనిపోయాక్కూడా అని ఇప్పుడు ఆయనకు ద్రోహం చేస్తావా? సమాధిలోన్ని పిలిస్తే, ఆయన ఆత్మ విలపించదూ?

తాత: (కన్నీరు కురుస్తున్న గొంతుతో) లేదు, బాబూ! లేదు. ఆయనకు నేను ద్రోహం చెయ్యలేను.

మనమడు: మరి నేను నీతో పాటే వుండిపోతాను.

తాత: (విషాద గంభీర కంఠంతో) సరే, బాబూ! వుండు.

తల్లి: అదేమిమాట, నాన్నా! నీకు మతిపోయిందా? నన్ను దిక్కులేనిపక్షిని చేస్తావా? ఈపాటు యుద్ధంలో భర్త పోనే పోయాడు. ఇక...

మనమడు: ఏమిటీ? మా నాన్న చచ్చిపోయాడా?

[ఎవ్వరూ జవాబుచెప్పరు]

మనమడు: (శోకోద్వేగంతో) జవాబు చెప్పరేమి? ...

ఏమమ్మా! ఈమాట నిజమా?...తాతయ్యా! నీవైనా చెప్పవా? ఎందుకు నాదగ్గర దాపరికం? చెప్పండి! చెప్పండి!!

తాత: నిజమే, బాబూ!

మనమడు: నాన్న చచ్చిపోయాడు...నాజీలకు బలి అయి పోయాడు...బలి...ఘోరబలి...నేను వెళ్లను, తాతయ్యా! ఏమైనా సరే వెళ్లను. వెళ్లమని నీవూ అనలేవు. నాకు తెలుసు...వెళ్లమనలేవు నీవు.

తల్లి: ఇది అన్యాయం! ఘోరాన్యాయం!! భర్త పోనే పోయాడు. కొడుకునుకూడా కాకుండా చెయ్యవద్దు. వెళ్ళ మని వాడితో చెప్పు, నాన్నా! (దగ్గరికి వెళ్ళి చేతుల్ని పట్టు కుని) నన్ను దయచూడు.

మనమడు: లేదమ్మా! తాతయ్య నోటివెంట ఆమాట రాదు.

అమ్మ: నాన్నా! నీకు దణ్ణం పెడతాను.

తాత: (దుఃఖవివశుడౌతూ) క్షమించు, తల్లీ! నన్ను క్షమించు. దుఃఖంతో నాగుండె పగిలిపోతున్నది. కాని, ఆ మాటమాత్రం అనలేను.

తల్లి : (తండ్రి ఎదుట మోకరిల్లి) నాకోసం అను, నాన్నా! నాకు పుత్రభిక్ష పెట్టు.

తాత : క్షమించు, తల్లీ! అనలేను.

తల్లి : (చప్పున లేచి కోపావేశంతో) అనలేవా? అనలేవా? కూతురునైన నాపై దయలేకపోతే పోయె - చచ్చి స్వర్గాన వున్న అల్లుడిపైనైనా దయలేదా, నాన్నా? ఆయనే ఇక్కడ వుంటే, నిన్ను ఎంతగా అసహ్యించుకునేవాడో!

తాత : నన్ను అంటే అనుగాని, అతన్ని అలా అవమానించకు తల్లీ! అతడి హృదయం నాకు తెలుసు. నేనూ, అతడూ అనేక యుద్ధాలలో కలసి పోరాడాము. అప్పటికతడు ఇరవైఏళ్ళవాడు. ఒకనాడు తీవ్రంగా గాయపడి, మరి ఆశలేదన్న స్థితిలో ఆసుపత్రిలో వుండగా నేను వెళ్ళి "ఇంత చిన్నతనంలోనే నీకెంత అన్యాయం జరిగింది?" అన్నాను. "అతడు విచారించకండి. నాకేమీ చింతలేదు. నా పోలెండ్ కోసం నేను మరణిస్తున్నాను. నేను పోతే మాత్రమేమి? నా పోలెండ్ చిరస్థాయిగా వుంటుంది" అన్నాడు. లేదు, తల్లీ! అతడు నన్ను అసహ్యించుకోడు. పైపెచ్చు మెచ్చుకుంటాడు.

మనవడు : తాతయ్యా! ఒకమాట చెబుతాను - నీవు కోప్పడకుండా వుంటే.

తాత : ఏమిటది, బాబూ ?

మనమడు : నిన్ను చూచి నేను గర్వపడుతున్నాను.

తల్లి : అయ్యొయ్యో ! ఇది ఘోరం ! ఘోరాతి ఘోరం ! నన్ను అనాధను చేస్తావా ?

మనమడు : అమ్మా ! నీతో కూడా ఒకమాట చెప్పాలి - నీవు కోప్పడనంటే.

తల్లి : కోప్పడ్డం దేనికి ? చెప్పు, బాబూ !

మనమడు : నిన్ను చూచి ఎంతో సిగ్గుపడుతున్నాను

ఒకేసారి { తల్లి : ఆఁ !
తాత : తప్పు నాయినా! అలా అనకూడదు.

మనమడు : ఇలా అన్నందుకు క్షమించు, అమ్మా ! కాని -

తల్లి : నీవు పసివాడవు, బాబూ ! నీకు స్త్రీ హృదయం లోతులు తెలియవు. ఈ యుద్ధం ప్రారంభమైన నాటినుంచీ, నే నెంత బాధపడుతున్నానో నీ కెలా తెలియజెప్పడం! వారంరోజులనాడు మన నగరంమీద విమానాలు బాంబులు వేస్తూవుంటే, నీవేమన్నావో జ్ఞాపకం తెచ్చుకో ! "నాజీలు మన వారాన్ను ధ్వంసం చేస్తున్నారు. మనం వాళ్ళ బర్లిన్‌ను

ధ్వంసం చెయ్యాలి. దానికి అదే ప్రతీకారం. అంతేకాదమ్మా?" అన్నావు.

మనమడు: ఔను. నేనలా అంటే, "నిజమే బాబూ?" అన్నావు నీవు.

తల్లి: పైకి అలా అన్నప్పటికీ, లోపల నాకు ఎన్నో ఆలోచనలు పోయాయి. జర్మన్ విమానాల ఘోరాఘాతాలవల్ల ఇక్కడ ఎందరో తమ బిడ్డల్ని, భర్తల్ని, ఆప్తుల్ని పోగొట్టుకుని విలపిస్తున్నారు. బర్లిన్‌పై మనం బాంబుల్ని వేసివచ్చినా ఇంతటి విషాదఫలితం కలుగుతుంది. పోలిష్ స్త్రీల దుఃఖమెంతో జర్మన్ స్త్రీల దుఃఖమూ అంతే! యుద్ధం ఎంత ఘోర వ్యాపారం! అని నేను అనుకుంటూ వుండగానే, ఉత్తరం వచ్చింది. దాన్ని చూడగానే, ఎంచేతనో నా గుండెలో రాయి పడింది. "నాన్నదగ్గరనుంచేనా?" అని నీ వన్నావు.

మనమడు: కాదని నీవు చెప్పావు. కాని, అది నాన్నదగ్గరి నుంచే వచ్చిందన్నమాట!

తల్లి: కాదు, బాబూ! ఆర్మీ హెడ్‌క్వార్టర్స్ నుంచి. పైకి పట్టుకువెళ్ళి, ఉత్తరాన్ని విప్పి చదువుకుందును గదా... ఆ క్షణంనుంచీ నాకు జీవితంపై అసహ్యంపుట్టింది. అయితే, నిన్ను చూచుకుని - నీకోసం _ నీలో జీవించాలను

కున్నాను. ఒక్కసారి గట్టిగా విలపిస్తే హృదయభారం కొంత తగ్గేదేమో! కాని, నీవు ఈ వార్త ఎక్కడ తెలుసుకుంటావో నని నా దుఃఖాన్ని ఓగమింగాను. ఈ వారంరోజుల నుంచీ...లాభం లేదు, బాబూ! చెప్పినా నీ కిది అర్థం కాదు.

మనమ : అర్థం కాకేమి? అర్థమౌతూనే వున్నదమ్మా! కాని, నాన్న ఏ ఆదర్శంకోసం జీవించాడో, దేనికోసం మరణించాడో, మనమూ దానికోసమే పాటుపడాలి. నాన్న బందిఖానాకి వెళ్ళుతూవుంటే, నీవు కళ్ళనీళ్ళు పెట్టుకున్నావు. అప్పుడు నాన్న కన్ను కూడా చెమ్మగిలింది గాని, దానిలో గొప్ప వెలుగు కనబడింది. అప్పుడు దాన్ని నేను అర్థం చేసుకోలేక పోయాను. కాని, తాతమాటల్ని విన్నమీదట "నేనుపోతే మాత్రమేమి? నా పోలెండ్ చిరస్థాయిగా వుంటుంది" అని నాన్న ఆ క్షణంలో అనుకుంటూ వున్నాడని తెలుస్తున్నది. నాన్న ధైర్యాన్ని, త్యాగాన్ని మార్షల్ పిల్సుడ్‌స్కీ జీవించి వుంటే ఎంతగా...

అమ్మ : పిల్సుడ్‌స్కీ ... పిల్సుడ్‌స్కీ ... రాత్రిం బవళ్ళు పిల్సుడ్‌స్కీ సంస్మరణే! దీనితోనే నా జీవితం వెళ్లమారి పోతున్నది. కూతురుగా నేను తండ్రి ప్రేమకు నోచుకోలేదు; భార్యగా భర్త ప్రేమకు నోచుకోలేదు. వారి హృదయాలన్నీ

పిల్సుడ్‌స్కీకే గాని, నాకు స్థానంలేకపోయింది. చివరికి కొడుకుప్రేమనైనా పొందలేకపోతానా అనుకుంటే, వాడి మతినికూడా విరిచివేశారు (తండ్రివైపు తిరిగి) నాకు ఎంత అన్యాయం చేశావు, నాన్నా!

తాత: పిల్సుడ్‌స్కీని ఒకవ్యక్తి అనుకుని నీవు పొరపడుతున్నావమ్మా! ఆయన ఒక భావం; ఒక లక్ష్యం; ఒక ధ్యేయం. పోలెండ్ ఆయనలో మూర్తీభవించింది. మేము ఆయన్ని ప్రేమించామంటే, పోలెండ్‌ను ప్రేమించామన్న మాట. ఆయనను స్తుతించామంటే పోలెండ్‌ను స్తుతించామన్న మాట. ఇది నీకు అర్థం కాదేమో గాని, పురుషులమైన మేము దాస్యాన్ని సహించలేమమ్మా! అది మా వ్యక్తిత్వానికే అవమానం. మా జీవితానికే అపవాదు. దాస్యజీవనంకంటె మరణమే మాకు మేలుగా కనిపిస్తుంది.

తల్లి: కాని, నామాటేమిటి నాన్నా? (జవాబుచెప్పక పోవడాన్ని చూచి) ఏమి, నాన్నా! జవాబుచెప్పవు?

తాత: నే నేమి జవాబు చెప్పగలనమ్మా?

[తర్వాత ఒకక్షణం అంతా ప్రశాంతం. అంతలో ఆ గభీరప్రశాంతిని చీల్చుకుని "స్విష్", "స్విష్" అంటూ వరసతప్పని వికృతధ్వని. పక్కవీధిగుండా మార్చి చేస్తున్న నాజీ సోల్జర్ల బూట్లు

చేస్తున్న ధ్వని అది. నెమ్మదిగా ప్రారంభమై, క్రమంగా హెచ్చు తుంది.]

తాత: అదిగో నమ్మా! నీ ప్రశ్నకు అదే జవాబు! నాజీ రాక్షసి తన ఇనప పాదాలక్రింద మన పోలెండ్ స్వతంత్ర రాజ్యాన్ని రాచివెయ్యాలని చూస్తున్నది. దీన్ని నీవు సహించగలవా? సహించవచ్చునా?

["స్వీష్", "స్వీష్" ధ్వని మరీ దగ్గరిగా వస్తుంది; మరీ భయంకరమౌతుంది. ఆ ధ్వనిని మించికూడా హాండ్ గ్రెనేడ్స్ ప్రేలుడు, భయార్తుల ఆక్రందనాలు వినబడతాయి. తల్లి పక్కనున్న కొడుకుదగ్గరికి జరిగి, అతణ్ణి కౌగలించుకుంటుంది.]

తల్లి: "అబ్బ! ఏమి ఘోరమిది!"

తాత: ఔనమ్మా! ఘోరమే! అయితే, ఇది మన పోలెండ్‌కు కొత్తకాదు. ఈ నాజీల తలదన్నినవాడు మన దేశాన్ని దాస్యబంధం చెయ్యాలనుకున్నారు; దాని ఆత్మను నశింపజెయ్యాలనుకున్నారు. కాని, నీ భర్త, నా కుమారుడు లాంటివారిని కన్న దేశం చచ్చిపోతుందా? పోదు! ఈ ప్రళయం తర్వాత పోలెండ్ పునర్జన్మ నెత్తుతుంది. ("స్వీష్", "స్వీష్" ధ్వని అంతకంతకూ దూరమై, అసలే వినబడకుండా పోతుంది) కాని, నాస్థితిని చూచుకుంటే నాకే సిగ్గు, విచారమూ కలుగుతున్నది. నా దేశానికి ఘోర

సంకటం తటస్థించిన ఈ సందర్భంలో దాని రక్షణకు నిలబడ్డానికి నాకు యవ్వనం లేకపోయింది. నే నెంత దౌర్భాగ్యుణ్ణి!

[తాత కంట తడిపెడతాడు]

తల్లి: అదేమి, నాన్నా! కంట తడిపెడుతున్నారు. మీరు కన్నీరు కార్చడం నేను చూడగలనా? నాకుమాత్రం మన దేశంపైన అభిమానం లేదా? కన్నకడుపు కాబట్టి, ఈ పసివాడి విషయమై దిగులుపడుతున్నాను గాని...

మనమడు: నా విషయమై మాత్రం నీకు దిగులు దేనికమ్మా? నేనూ నావంటివారూ సుఖంగా, గౌరవంగా, జీవించడానికి సరిగ్గా స్వతంత్ర పోలెండ్ రాజ్యాన్ని కాపాడ్డానికే గదా, నాన్న ఆత్మార్పణ చేసింది! దీనికోసమే గదా తాత ఇంత వృద్ధవయసులో కూడా తుపాకిపట్ట బోతున్నది!! మాకోసమై జరుగుతున్న ఈ ప్రయత్నంలో నేను పాల్గొనవద్దా?

తల్లి: నిజమే, బాబూ? కాని...

మనమడు: కాని, గీని అని ఇంకా సంకోచపడతావు దేనికమ్మా? (ఇంతలో తిరిగి విమానాలరొద. ఆ రొదను మించేలా అతడు గొంతెత్తుతాడు.) తాత ద్వారా నీవు వీరపుత్రికవైనావు. నాన్నద్వారా వీరపత్నివైనావు. ఇక, నా ద్వారా వీరమాతవు కా గోరతావా, లేదా?

తల్లి : తప్పక కోరతాను, బాబూ?

మనమడు : అయితే, అమ్మా! మాతో చేరి విజయధ్వానం చెయ్యి : "పోలెండ్‌కు జై".

తాత
తల్లి
మనమడు } : పోలెండ్‌కు జై!

[మువ్వురూ అంటారు]